శ్రీ హనుమత్పరబ్రహ్మణే నమః.

# ఆంజనేయ శతకము



ఇది

శృంగగిరిసంస్థాన పాఠశాలయందలి

సాహిత్యవిద్యార్థియైన


## పరాశరం నరసింహాచార్యులచే


రచియింపఁబడెను.

## అందుకూరు.


1934

గుంటూరు

ఆర్యవైశ్య ముద్రాక్షరశాలయందు ముద్రింపఁబడెను.

శ్రీ హనుమత్పరబ్రహ్మణే నమః.

# ఆంజనేయ శతకము

ఇది

పుష్పగిరిసంస్థాన పాఠశాలయందలి

సాహిత్యవిద్యార్థియైన

## పరాశరం నరసింహాచార్యులచే

రచియింపబడియె.

## అందుకూరు.

1934

గుంటూరు

ఆర్యవైశ్య ముద్రాక్షరశాలయందు ముద్రింపఁబడినది.

# మనవి.

నేను తొలుత పదునారు సంవత్సరముల వయస్సునం
"శృంగారనక్షత్రమాల" యను చిన్నిపొత్తమును ర
యించితి. శృంగారభూయిష్ఠమైన దగుటచే నా పొత్త
ప్రకటించుటకు వీలులేనిదయ్యె. తరువాత కొంతకాలమున
శంకరాచార్యులవారిచే స్థాపించబడిన గీర్వాణవిద్యాల
ములో జదువుచుండి, యీశతకమును వ్రాసితిని. భ
ప్రధానమని రచించితినిగాని పాండిత్యపాటవము వెల్లడించ
టకుగాదు. దీనిని సర్వజ్ఞులైన సకలసుజనులు తమ చిన్ని
బాలుర యసంపూర్ణవాక్యములరీతి విని సంతసించి నన్న
కృతార్థుని జేయ వందనశతంబు లొనర్చుచుంటి.

అందుకూరు,
సత్తెనపల్లితాలూకా
6-6-1934.

ఇట్లు,
సాహిత్యవిద్యార్థి
పరాశరం నరసింహాచార్యులు.



శ్రీ హనుమత్పరబ్రహ్మణే నమః.

క॥ శ్రీమన్నృసింహనామ, మ
హామహిత, పరాశరాన్వయాభరణగుణో
ద్దామ, భవద్విరచితము హ
నూమచ్ఛతకము జగద్వినుతమై తగుతన్॥

మ॥ సరళంబై మృదుశబ్దసంయుతమునై సద్భావసంభావ్యమై
పరమానందకృదర్థమై నవరసప్రాగల్భ్యతం గన్న నీ
వరమాధుర్యకవిత్వతత్వఘటనా వాల్లభ్యసిద్ధిప్రదమై
ఖరి యెవ్వారికి మెప్పొసర్పదు గనంగా నారసింహాభిదా

మ॥ కదులేబ్రాయమునందె ప్రౌఢపదసంక్రాంతంబుగా బద్య
ములల్ నుడువన్నేర్చినట్టి దిట్టవగు నిన్నుం బోల్పగా నన్యు
డెవ్వడు గన్పట్టడు వర్తమాన సుకవివ్రాతంబునన్ ధాత్రి
నెయ్యెడనైనన్ నరసింహనామక కవీ హేరాళ తేజోరవీ

సీ॥ ఎవ్వాడు తొలువాల్త వినతనూభవ దాశ
రథులకు మైత్రి గరంబు గూర్చె
నెవ్వాడు రామాంగుళీయకంబు వహించి
ధాత్రీజ వరయు విధాన మూనె
నెవ్వాడు చివ్వన నెగసి పాథోనిధి
తోటకాలువభంగి దాటి చనియె
నెవ్వా డశోకమహీజమూలమున మ
హీజనమాన్య మహీజ గనియె

తే॥ శుభచరిత్రకు నవ్వాయుసుతుని నతుల
గతుల నుతుల గరంపగా గలిగె గాన
వర పరాశరవంశసాగర శశాంక
గళితఘనపంక, నీకెందుగలదె వంక॥ 4

చ॥ కరమనురక్తితోడ రఘుకాంతుని సేవయొనర్చి సద్గణో
త్తరమహనీయతం గనిన ధన్యుని మాన్యుని నిన్ను గూర్చి
దా।పరమకుతూలహంబెసగ వ్రాసెగదా శతకంబు గీశశే
ఖర, మన నారసింహకవి గావుము నిన్నలరాముడెట్లటుల్॥

ఇట్లు,

కేసనపల్లి, } పరిశీలనకర్త
కేసనపల్లి లక్ష్మణకవి.



శ్రీ హనుమత్పరబ్రహ్మణే నమః.

# ఆంజనేయ శతకము

శ్రీకంజాప్తకులుండు రాముపదముల్ సేవ్యంబు తానంచు న
స్తోకోత్ఫుల్లక రాజ్ఞయుగ్మమున తద్దోశ్శాలి క్షేమాంఘ్రులన్
వీకన్ జేరిచి సేవజేయు నిను నే ప్రీతిన్ దగన్ గొల్చెదన్
సాకల్యంబుగ నందుకూరిపురవాసా యాంజనేయప్రభో॥

మ॥ ధరలో క్లిష్టప్రబంధసంఘటనమేధాశాలి, పౌరాణవి
స్తరవాణీశుకసామ్యు, లక్ష్మణకవిన్ తథ్యంబుగా నాకవి
స్మరణీయున్ సుగుణజ్ఞు, నాంధ్రకవితా మాత్రోపదేష్టన్
తమో । నిరసున్ కేసనపల్లివంశజు వెసన్ సేవ్యోప్పగా
నెన్నుదున్ । పరగ్రంథాదిని నీకృపన్ విమలరూపా యాంజ
నేయప్రభో॥ 2

మ॥ భవదీయాద్భుతసచ్చరిత్రమహిమన్ పల్కంగ శేషాహికిన్
వివరంబే యిల నీశ్వరుండనని యవ్వింధ్యారి రామావనీ
ధవుతో జెప్పెను తొల్లి నిక్కముగ నీతథ్యాత్మవృత్తాంత
మున్ । సవిశేషంబుగ నందుకూరిపురవాసా యాంజ
నేయప్రభో॥ 3

శా॥ నీవే కావె యనాదిమూర్తివి భవన్నిర్ణేతలున్నారె లీ
లావేశత్వము బొంద నిచ్చవొడమన్ రమ్యంపురూపత్రయిన్
భావోత్ఫుల్లముగాగ దాల్చి భువనవ్రాతంబు సృష్టించి లో
కావాసిత్వము బొంది మెల్గితివటయ్యా యాంజనేయప్రభో॥

మ॥ వసుధన్ సత్త్వరజస్తమోగుణములన్ భాగప్రకారాత్ములన్
తిరమౌనట్లు చరాచరాత్మజగతిన్ తేజోఽణుకవ్యాప్తిచే
ధరభారంబువహించి మానికులసద్భావంబులో నుండి స
త్పరణిన్ జూపుగ నందుకూరిపురవాసా యాంజనేయప్రభో॥

శా॥ ఏరీతిన్ గన జంతుజాతములనన్ హీనాధికారంబెగా
నానావారసిధంబులౌ భవములన్ భాగ్యేచ్ఛ చేబొందు, త్వ
త్కారుణ్యార్ణవపూరసిక్తపదమున్ గన్పట్టగా జేయు నీ
చారిత్రల్ ధర నందుకూరిపురవాసా యాంజనేయప్రభో॥

మ॥ నిగమంబుల్ వెలియించు ధాతృచయముల్ నిత్యంబుగా
కొన్నినాళ్ళగ వెన్నుండగు, వాగు కొందగు చనన్ స్వా
స్పదం బీవయై తగ నుద్దీపనమొందు దట్టిడగు నీ తర్కింప
మాయావివేషగతిన్ గన్పడు నందుకూరిపురవాసా యాం
జనేయప్రభో॥ 7

మ॥ తొలుతన్ స్వేచ్ఛచే సర్వభూతసమితిన్ దుర్వారనై పుణ్య
తన్ గలుగన్ జేసియు దేనికేది దగు నా కార్యోద్భవంబున్
వినిశ్చలతన్ గూరిచి యాదటన్ సకలమాసద్ధర్మశాస్త్రాళి పే
శలమౌరీతి రచించితీవు మునిదృశ్యా యాంజనేయప్రభో॥

మ॥ నియతిన్ జీవసమూహ సృష్టిని వెసన్ నేర్పొప్పగా నేర్ప
రచియు తత్తద్భవజ్ఞానయోగ్యత తగన్ చేయూతచే
వర్తనంపు యథార్థంబును జూపు కర్తవని పూజించుగా
మానిసంచయ మెల్లనొప్పను నందుకూరిపురవాసా యాంజ
నేయప్రభో॥ 9

మ॥ ధరలో జంగమస్థావరాత్మలకు వేదైశ్వర్యంపువృద్ధిన్ సమా
వరసోద్భూతము గాగ నల్పి నిగమాంతంతోద్భవాకారవై
ఖరుల న్బొందియు విష్ణుసంజ్ఞగని సాకారత్వము న్బొందు నీ
చరితం బింపగు వందుకూరిపుర వాసా యాంజనేయప్రభో॥

శా॥ భూమిన్ జంతుసమూహ నాశనక్రియన్ బోల్పారగా
జేయు రుద్రామానుష్యసురూపప్రాప్తిగనియున్ తద్రీతుల
న్నల్పగా। భీమాకారత బొందియున్ సుజనజాభీలాంతమున్
జేయవా। సామాన్యుండవె వందుకూరిపురవాసా యాంజ
నేయప్రభో॥ 11

మ॥ నిజనైపుణ్యవిశాలశాలి వగుచున్ నీవెంతో జంత్వాదిషం
చజనవ్రాతము నంతటన్ పురుషయోషాసంజ్ఞల న్నల్పి క
ర్తృజకార్యంబుల వారికే యొసగుచున్ హృష్టుండవై తీవు
తో। యజభూతామరవందితా, సుమునిదృశ్యా యాంజ
నేయప్రభో॥ 12

మ॥ భువి యజ్ఞాధికకర్మదేశికుడవై పోషించు సత్కర్తవై
నవబుత్వ్యగ్నివహాంబవై నియతిగా నవ్యాన్నభోక్తృత్వషం
భవకర్తృత్వము గల్గి వర్తిలెదు నిన్ వర్ణింప సర్వాత్మవా
సవనాకారుడ వందుకూరిపురవాసా యాంజనేయప్రభో॥

మ॥ తపమున్నల్పియు నంజనాసతి నినున్ దైవేచ్ఛచే గాంచ
గా। తపనున్ పండని మ్రింగబోయి వర సంతానంబు. వే
బొంది యంత పురారిన్ గని హాస్యమున్నలుపు దోర్ద

ర్పంబుచే నొప్పి కీశపతిన్ గూడితి వందుకూరిపురవాసా
యాంజనేయప్రభో॥ 14

మ॥ భువనాధీశుడు భూమిజావరుడు తా భూజన్ గనన్లేక శోకా
రవనిన్ దిరుగాడి పంప దరిజేరన్ నీవు గొంపోయి త
న్నవభూపాదుల జూపి దుఃఖనిధిలోనన్ మగ్నుడౌ రాము నే
శవిదారుండవె యందుకూరిపురవాసా యాంజనేయప్రభో॥

మ॥ ఘనరాత్రించరసంచయావరణలంకాపత్తనం బేగి వే
గని భూజాతను, రామునన్నిధికి వీకన్ వచ్చి తత్క్షేమవా
ర్తను దెల్పి ప్రవికాసచిత్తయుత సీతాభర్తృభాస్వత్ప్రశం
సనితజ్ఞానివిగావె మున్ను కపిశ్రేష్ఠా యాంజనేయప్రభో॥

మ॥ నరజన్మంబున బుట్టినేని యమితపుణ్యంబును గందుర్ వివే
కరసజ్ఞుండయి యుద్భవించియును త్వత్కారుణ్యము న్బొందు
టల్। ధర దుస్సాధ్యముగాన నీదయను బొందన్ భక్తిచే
గొల్తు నీ। చరణద్వంద్వము వందుకూరిపురవాసా యాంజ
నేయప్రభో॥ 17

మ॥ విచలచ్చిత్తుడనైన నాహృదయమున్ విస్తారక్షేత్రంబులో
నచిరప్రాప్తఫలాప్తిమైశుభమౌ యత్యంతగీర్వాణవా
గ్నిచయం బన్ ఘనశాఖినాటబడెగా నిచేత నో సర్వవే
దచరిత్రాంచిత, రామతారకవిశుద్ధా యాంజనేయప్రభో॥

మ॥ సమరంబందు, నరాధినాథుగెలువన్ జైత్రేశులై యొప్పువా
రి, మహోన్మత్తత లెక్కసేయక, వెసన్ లీలావికారంబుచే

త, మహిఁ గూలగ జేసి బొందితివిగా స్థైర్యోజ్జ్వలాకారివై,
సమవర్తిత్వము నందుకూరిపురవాసా యాంజనేయప్రభో॥

మ॥ భవగ్రీష్మానలతప్తచిత్తులగుచుఁ బారంబు లేకుండ త
ద్భవదావాదద్రిగులయ్యు, త్వచ్ఛరణముఁ భావింప వారిఁ
త్వరఁ । నవమున్మత్పదకంజభూరసముచే నాల్కంఁ దడిఁ
జేయుచుఁ । చవిజూపించితి నందుకూరిపురవాసా యాంజ
నేయప్రభో॥ 20

మ॥ భువిలో మానవకోటికిఁ సహజసంభూతంబులై యొప్పు
బాల్యవిచేష్టాళిని మన్నంబునను జేరఁ శక్తి లేకుండ జే
సి విధానప్రతిభాకళాయుతునిగా జేయఁ దగన్నూతువో
లవవస్త్వంతరవాసుడా యసురకాలా యాంజనేయప్రభో॥

మ॥ విలసన్మానసమంజరీపతన సద్విస్తీర్ణసూనాతి వా
క్కులచే తోషముబొంది రామవిభు డక్కుఁ జేర్చి నిన్నా
ర్చె తా । నిల దీర్ఘాయువు గల్గునం చనిమొ నీకింకఁ జగ
న్మండలిఁ । చలనంబున్న దె యందుకూరిపురవాసా యాంజ
నేయప్రభో॥ 22

మ॥ ఖర స్వాభావికచిత్తముక్తులగు వక్రంచారసందోహముల్
నిరతం బేగిము సత్ప్రవర్తనలచే నిష్టాత్ముతౌ వారి దు
ర్భగబాధాఽబ్ధిబడంగ జేయగను వారల్ వేడ నీ తేజమే
శరణీయం బిల నందుకూరిపురవాసా యాంజనేయప్రభో॥

మ॥ వినయాకారసభక్తిచిత్తయుతుడే పీడంచు రాముండు స
ఘ్నవాణీచయపాణిచే, సకలమంత్రప్రాభమంత్రంబనే

ధనరాశిఁ భవదీయశబ్దగ్రహ హస్తంబంకు వేబెట్టి, భో
జన మీ వేయని యందుకూరిపుర వాసా యాంజనేయప్రభో

మ॥ అమరశ్రేణియు మేలనఁ దనుజ దారాదుల్ విశోకాగ్నిమ
గ్నమనోయుక్తులుగాగ, యక్షజనతాగంధర్వసిద్ధాదులె
ల్ల ముదంబొప్పఁగ శాడ. నక్షయుని దోర్దర్పంబుచే జంపి
యోట మదిఁ దాల్చక నుంటి వీవు కపిశ్రేష్ఠా యాంజ
నేయప్రభో॥ 25

మ॥ తనుధీయుక్తులరయుం దుస్సరణిచేతఁ సజ్జనవ్రాతముఁ
ఘనపీడానికరంబులో ద్రోలిపి వీరఁ విద్రవీగంగనై
న, నవోద్భూతసుధీయుతత్వమున నీనామంబు వేబల్కఁగా
జనుగా పాపము లందుకూరిపుర వాసా యాంజనేయప్రభో॥

మ॥ దిటవౌ చిత్తము గల్గి రావణుంకు నాతిఁ వేగ గొంపోవ
నాదట సీతాధవు డల్గి వానరులతో తా నేగి ద్వైతేయరా
డ్భటవర్గంబును కాలుసన్నిధికి బంపఁ యత్నము న్సల్ప, బా
సటగా నుంటివి యందుకూరిపుర వాసా యాంజనేయప్రభో॥

మ॥ పోరి పౌలస్త్యుని లంకకుఁ జని, యటఁ భూజాత వీక్షించి
యా। సురవైరీంద్రుల ముష్టిపాతములచే సూర్యాత్మజుఁ
జూపి, వేసరకఁ రావణుతోడ బల్కితివి వాక్సందోహ
ము న్వేగ, పో। సరము న్వేవగ నందుకూరిపుర వాసా
యాంజనేయప్రభో॥ 28

మ॥ తతగాంభీర్యముచేత లంక గనియుఁ ధాత్రీసుతాచిత్తసం
గత శోకాగ్నిని కేలగైకొనియు వేగఁ తత్పురీమధ్యమం

చి, తరగ గాల్చియు రామనామ వరమ్ముగ చింతింతు వౌ
త్వత్పుద్ధైర్యత లేపెందును భూమిలో నసుర కాలా యాంజ
నేయప్రభో॥ 29

మ॥ నరనాథుండగు సూర్యవంశజుడు తా నక్తంచరుగ జంప
వానరనాథుండగు సూర్యజుగ గొనియు దస్వల్లంఘునం
బుగ రచించి, రణంబుగ దగసల్పు దిష్టమున తత్సేవాళి
యే నీకు కీ.సరగా గన్పడె వందుకూరిపుర వాసా యాంజ
నేయప్రభో॥ 30

మ॥ శమకార్యార్థకు రాము నాజ్ఞచే నభస్వద్వేగతగ లంకజే
రి మహీంజగ గని క్రోధవేగమున భూరిస్తోమదైత్యేశులగ
యముబొందించి పురిగ దహించుసమయంబందుగ గన
న్లేను క్లిష్టము నీకించుక వందుకూరిపుర వాసా యాంజ
నేయప్రభో॥ 31

మ॥ తమకుగ సాధ్యవిహీనమౌ జలనిధిగ దాటంగ నిన్వేడ సం
ద్రము లంఘించియు, లంకినిగ దునిమి సీతగ గాంచి వే
వచ్చి తాత్సము దీర్ఘాతిశయంబులగ వెలుపగా శాఖా
మృగంబుల్ వికాసము నందెగ మును వందుకూరిపుర
వాసా యాంజనేయప్రభో॥ 32

మ॥ సకలారాతి విజేత్రు రామనయనస్థానోద్భవంబైన భా
ష్పకులంబుగ గొని లంకకేగి, యట దోషాఢత్నమై
యొప్పు జానకినిగ గాంచి తదూష్మజాలమునకుగ దై
త్యాంగనానేత్రవాసకతగ గూర్చితి వందుకూరిపురవాసా
యాంజనేయప్రభో॥ 33

మ॥ ఇల మర్త్యాళి స్వజీవజాతమును సుంపేర్మిఁ సుభక్తిఁ భవ
త్ఫలభూమిష్టసువర్ణవర్ణసమపాదద్వంద్వరాజీవ సం
చలనేందిందిరమౌనటుల్ సలుపకే సంచారముఁ జేయఁగా
జల బింబంబగు నందుకూరిపురవాసా యాంజనేయప్రభో॥

మ॥ వితతాధీశులు జిష్ణుభామజులు వేవిస్తారముఁ బోర నీ
వతియుక్తిఁ జలజాప్తనందనునితో నత్యంతము స్చెల్మిఁ జే
సి, తగఁ రాముని వీనికిఁ సఖునిగా సేయంగ నిన్బొందె ని
ష్పతిసామ్యత్వమే యందుకూరిపురవాసా యాంజనేయ
ప్రభో॥ 35

మ॥ జనముల్లేమియను జ్వరార్తినుపవాసవ్రాతముల్ భారలం
ఘనముల్ సల్పియు, హద్దుకై విడచిపోకఁ నిల్పు జీవంబుతో
వనయం బెంతో క్షుధాకులాఢ్యులయి నిన్నత్యంతము
న్వేడ గో। స్తనిగా నొప్పెద వందుకూరిపురవాసా యాంజ
నేయప్రభో॥ 36

మ॥ భువి సామాన్యులు స్వల్పమౌ సుజనసంభూతాతిసన్మార్గరీ
తివశత్వంబున మోక్షసాధమును తా దీవ్రంబధిష్ఠించు భా
వవికౌతూహలులయ్యు నొప్పు, తగు సోపానంబు వే జూపు
నేతవు నీవేగద రామతారకవిశుద్ధా యాంజనేయప్రభో॥

మ॥ జలధిఁ దాటి సురారిపత్తనమునఁ సప్తార్చిషుఁ జేర్చి యా
వల సీతఁ గనుగొన్న వార్తలను భూపశ్రేష్ఠుతో బల్కి, భూ
వలయాధీశునిగూడి రక్కసుల జంపఁ దేవతల్ పూవుసే
సల నర్పించరే, యందుకూరిపురవాసా యాంజనేయప్రభో॥

మ॥ భయమే కొంచెము లేక దైత్యగణభూషశ్రేష్ఠు లంకాపురిన్
రయతన్ జొచ్చియు, నిగ్రహాదులను లీలామాత్రతన్ జంపి య
క్షయునిన్ దున్మియు పత్తనంబును వెసన్ కాల్చన్నిమున్
బొందెగా । జయనారీమణి యంకకూరిపుర వాసా యాంజ
నేయప్రభో॥ 39

మ॥ అరిషడ్వర్గములోన జిక్కి, నిరతం బజ్ఞాన దుఃఖంబునన్
పరిమగ్నత్వము జెంది, గుంకుచును నేపారంబును న్గానకన్
ధరపైగూలు ద్విపాదజంతువులకున్ తథ్యంబుగా నీవె ని
స్తారిణియుండవు గాంకుకూరిపుర వాసా యాంజనేయప్రభో॥

మ॥ జనజాతంబుగ్రహాదిసంచయముచే సర్వత్రపీడార్ణవం
బున వేమగ్న, భిషగ్వరుండు నియతిన్ భూతప్రతీకారమున్
ఘనతన్ జేసెడికాలమందు నిను వేగన్ దల్ప వజ్రప్రదం
శనమైపొమ్ముప్పుడు వంకుకూరిపుర వాసా యాంజనేయప్రభో॥

మ॥ భువిలో నెన్నియొ గేహకృత్యముల సంపూర్ణంబుగా
జేయగా।నీవిరోధుల్ రచియించు ఘోరములనేనిన్ ద్రుంప
గా గాని య।త్నవిరూఢత్వము లేక నే జరుగు త్వన్నామం
బు నెల్లప్పు మా।నవమాత్రుంకు దలంప భక్తజనత్రాణా
యాంజనేయప్రభో॥ 42

మ॥ భ్రమచే దుర్వినయాబ్ధిలో మునిగియే భవ్యాత్మకర్మంబు
లన్।సమకూర్వంగను లేక మూఢతను త్వత్సన్నామమున్
దల్పగా।గమకించన్ ఘనపాపముల్ జనుచుగాకన్, ముం
దుగా వచ్చు దో।సము లే యంటవు గాందుకూరిపుర వాసా
యాంజనేయప్రభో॥ 43

మ॥ వికచాస్యంబున బాలభాస్కరునిపై వేగంబు యేగంగ న
ర్భకు డెవ్వా డితడంచు గిన్క గనకన్ బ్రహ్మంబు వైచె నత్యో
పచారకుభంగిన్ దగె నింత నీమహిమయే లక్ష్యంబు
దేవారిశాసక నిన్నమ్మితి వందుకూరిపుర వాసా
యాంజనేయప్రభో॥ 44

మ॥ నిగమాద్యుల్ భవదీయవర్తన సన్నిజ్ఞేతలై యొప్ప, మా
నిగణంబుల్ నిజచిత్తసాధ్యమున నిన్నిత్యంబు సేవించెడిన్
తగనారీతిని నేను ప్రత్యహము త్వత్పాదంబులన్ గొల్తు నన్
జగతిన్ బ్రోవగ వందుకూరిపుర వాసా యాంజనేయప్రభో॥

మ॥ ధవుడౌ రాఘవు నానతిన్ గొనియు సీతన్ గాంచగా వాయువే
గవశత్వంబున నేగు కాలమున త్వత్కంఠస్థలోద్భూతమా
రవమీరీతిని 'రామరామ' యను చర్యా రామాకృతిన్ జల్లెగా
భవచ్ఛేదంబుగ భూమిలో విమలరూపా యాంజనేయప్రభో॥

మ॥ మిము గాంచన్నలె వన్న దాంతిశమసమ్యక్ శక్తులన్ గల్గి ని
యము చేతన్ తగ జ్ఞానదృష్టి వశతన్ మౌనులు సదా జూచు గా
న, మహిన్ నేనటు జేయలేనికతనన్ నాకున్ భవద్రూపమున్
శ్రమగా నన్నిక జూపు మీవు జగదీశా యాంజనేయప్రభో॥

మ॥ నిరతం బీగతి వేడి, యో ప్రవిమలా నిత్యానుకంపానిధి
భరపీడాంతక, సజ్జనావన, జగద్భారావహా, పోషకా
దురితాంభోనిధికుంభసంభవ, సుసంతోషాస్పదా యంచు నిన్
శరణంటిన్ ధర వందుకూరిపుర వాసా యాంజనేయప్రభో॥ 48

మ॥ మును దేవాంగన శాపకోణమునన్ మోసంబుగా నీచ జ
న్మను వేశ్యాంగియు లంకఁ గాచుచును భీమంబయ్యెగన్పట్టి నీ
తనుగాంచన్ జని నీవు సంగరమునన్ తద్ఘోరశాపాళిమో
చనమున్ జేసితి వందుకూరిపుర వాసా యాంజనేయప్రభో॥ 49

మ॥ తమముల్ ద్రెంచగఁజాలు శక్తిగల భూతప్రాభవుండైన రా
ము మహన్నామపరంపరాక్షరములే మూర్తీభవించెన్ భవ
ద్విమలాకారముగాను, వాకతన నీవిశ్వంబ శేషంబు రా
మమయంబే గద కిల్బిషాంతక మహాత్మా యాంజనేయప్రభో॥

మ॥ మరితార్థిన్ బడి యీగువారలకు నెంతోదార భూతుండవై
పరివర్తింతువు, నీమహామహితు లెవ్వారల్ గనంనేర్తురి, ని
ద్ధరలో సేవక కల్పభూజమవు భక్తత్రాణమే నీకు నా
చరణీయంబిల నందుకూరి పురవాసా యాంజనేయప్రభో॥

మ॥ భువనవ్రాత సుజన్మసజ్జన మనోభూతార్చనాగ్న్యండ వీ
వు, వనోద్భూతసుకందమూలముల నేపుర్ బోవ భక్షించు
మానిని వరేణ్యుల్ నిను పూజజేతు రెవరున్ నీమూర్తి వీ
క్షింత్రు, కేశవ భక్తాగ్రణి వందుకూరిపురవాసా యాంజ
నేయప్రభో॥ 52

మ॥ పరులెవ్వారలు నీప్రవర్తనల భావంబందు నెన్నంగనే
ర్తురమాధీశుడునైన దుర్జనములన్ దున్మాడగా నేర్చు భూ
వరుడౌ రాముడెఱుంగు మానవులు నిర్వర్ణింతురే, వాగగో
చరమై యొప్పెద వందుకూరిపురవాసా యాంజనేయప్రభో

శా॥ ర్రామాంఘ్రిద్వయ పంకజోద్భవ సువర్ణాంచద్రజోరాశి
సిన్ । షేమోత్కృష్టతమంబటంచును భవచ్ఛ్రోత్రోపరిన్ దా
ల్చు, న॥ న్నామోదంబుగనంతరంగమునఁ నే నత్యంతముస్గా
ల్తు, నో। స్వామీ నన్నను మందుకూరిపురవాసా యాంజ
నేయప్రభో ॥ 54

మ॥ శరణంబన్న విభీషణున్గని యు నానక్త్యేశుడై రామభూ
వరుడీషత్స్మయుంబు సంశయముచే వర్తింప, నీవంత, నో
పరమాత్మా త్వరరక్షణీయుడనుచున్ వాక్రుచ్చినావయ్య భా
స్వరచిద్రూపుడ మందుకూరిపురవాసా యాంజనేయప్రభో।

శా॥ రంగత్కాంచనవర్ణదేహయుత బాల్యంబందు నేయుండి వె
నింగిన్గన్నను సూర్యుకై యెగసి తన్నిర్మాల్యరోచి ప్రభా
భంగాభంబును బొందితివిలను, నీభాస్వద్రుచిన్ జూడగా
సాంగోపాంగమె యుంగుకూరిపురవాసా యాంజనేయప్రభో॥

మ॥ నలసీలాది కపీంద్రసంచయము నానాయోచనల్ సల్పి స
ల్పి లసద్వేగముచేత లంకగన పేర్మిన్ని వెగాకున్న నీ
కిలసామ్యుల్ గలరేయటంచు బలుకన్ హెచ్చైచ నక్షీప్రశం
బుతో । జలధిన్ దాటితి మందుకూరిపురవాసా యాంజ
నేయప్రభో॥ 57

మ॥ గ్రథసంబంధమిక లేదుగా, జనుడత్వల్లబ్ధంబు నాకేల గ
ల్గు, భవత్పాదరజోసమూహమె వనున్ కుంభిన్ బుధశ్రేష్టుతో
నిఘనిన్ జేయును దీనరక్షక సుధీనేత్రుండవౌ నీవాగిన్
సభయుండన్గను మందుకూరిపురవాసా యాంజనేయప్రభో॥

శా॥ స్సించద్భక్తహృదంబుజుండవు నిన్నుఁ సేవించి మెప్పించి వే
గాంచ న్గోరికెబుట్టె మన్మనములో కారుణ్యరత్నాకరో
దంచత్పూరములోనముంచి, మొర నీవాలించిరక్షించుమో
చంచచ్చిత్తుడ నందకూరిపురవాసా యాంజనేయప్రభో॥

మ॥ హనుమంతా హనుమంత వాయుతనయా యంచు న్నిను
న్భక్తిచేదినమంతఁ రసనాగ్రవ్యాప్తిగను తాదివ్యంబుగా
బల్కుచుఁ । వినగ న్నేరని నీచమానవుడు పృథ్వి న్నేమి
సాఫల్యమా।జననం బెత్తగ నందకూరిపురవాసా యాంజ
నేయప్రభో॥ 60

మ॥ క్షరమారణ్యసుకందమూలములనేగాకఁ సువాతంబులఁ
నిరతంబు న్దగభక్షణాల్ సల్పుచు న్నిష్ఠాత్ములై యోగదృ
గ్వరులై, యుష్మదణుస్వరూపులయి విన్గాంచఁ బుధుల్ వేగ నీ
సరసజ్ఞేయుడు నందకూరిపురవాసా యాంజనేయప్రభో॥ 61

మ॥ వితతాదార్కప్రభాకరాత్మజునితో వేగంబుగా చెల్మిస
ల్పి, తగఁ ధీసచివత్వముఁ జరిపి సుప్రేమాతిరేకంబుచే
స్తుతిపాత్రంబుగ రామబ్రధ్నజులకుఁ సుస్నేహము న్గల్గజే
య, తిరంబౌ యశమొందె నిన్నిల మహాత్మా యాంజనేయ
ప్రభో॥ 62

మ॥ కరమై యొప్పెడి మత్కృతంబుల, కహంకర్తా యటంచు
న్నిరంతరము న్దల్చెడి యస్మదీయమగు చిత్తప్రౌఢదర్పంబు నీ

---

ఇందులో పెద్దక్షరములను వరుసగా జదివిన, ఇంటిపేరు కవిపేరును తెలియును.

వరుదారఁ బసియింపజేసియును, నాకత్యంతత్వత్పాదపం
కరుహాపేక్షనొసంగు, రామనిజభక్తా యాంజనేయప్రభో! 63

మ॥ ఇలలో నెందరొ మానిసంఘములు తా మిష్టంబులం గో
రవచ్చి, లనత్పూజ లొనర్చ్రి, నేనటుల సాఫల్యంబుగా
గొల్వ నేర నలంతి కల్పిషచిత్తుడన్ మిగుల బాల్యంబునం
నే యుంటి, నిర్మలున్ జేయుమో యందుకూరిపుర
వాసా యాంజనేయప్రభో! 64

మ॥ దివిజాదిప్రముఖుల్ భవచ్చరితమున్ దివ్యంబుగా బాడు
చున్ ! భవదీయాద్భుతరూపవైఖరుల సద్భావంబులో
నెంత్రు నీభువనోద్భూతసుభక్తసంచయము నేపుం మీర
నిం జూడ సాత్వమందున్ భువి నందుకూరిపురవాసా
యాంజనేయప్రభో! 65

మ॥ భుజగశ్రేష్ఠమునందు వందు దొరకున్ ముఖ్యంపుభక్తుండ
వంచు, జగంబందుతమోఽతిసంతతికి తేజోరాశి వీవంచు త్వ
ద్భజనల్ సల్పగ నెట్టివారికిని తద్భావంబులో వేగ నా
స జనించున్, ధర నందుకూరిపురవాసా యాంజనేయప్రభో॥

మ॥ అని రామానుజుడెంతొ మూర్ఛిలగ, నీవంతన్ సుషేణా
దులానను శీర్షంబున దాల్చి, భూరివనవా నారణ్యపుణ్యప్రదే
శనవాంచ ద్ఘనదేశము న్గడచియున్ సంజీవియున్గ్రావమున్
జని వే దెచ్చితి నందుకూరిపురవాసా యాంజనేయప్రభో! 67

మ॥ కలుషేభంబుల శిక్షలక్ష్యులుప లోకప్రాభవైకాంకుశం
బు, లుతత్పామముఖారివర్గముల 'వే'ఖా కార్యకాలప్రభా

విలసద్దండము, విఘ్నశైలములకుఁ విస్తారదంభోళి, ని
ర్మలత్వన్నామము భూమిలో నసురకాలా యాంజనేయప్రభో।

మ॥ జయకాంతాగత రామలక్ష్మణుల తా నత్యంతరత్వంబుచే
రయముఁ జేర్పితలంబునఁ దనుజుఁడా లంకన్గనన్బోయి వా
ని యముఁ జేరిచి వారి దెచ్చినది నీ నేర్పేగదా, నీకు దు
ర్జయమే మున్నది, యుందుకూరిపురవాసా యాంజనేయప్రభో।

మ॥ ధర దాస్యాది సమస్తకష్టదశలఁ ద్వన్నామసంకీర్తనం
బునుభక్తిం దగనల్పువారలకు పూర్వోదీరితావస్థలుఁ
నిరంత బేగుబెగాక భాగ్యశుభమే నిల్పుఁ సదా నీకు, దు
ష్కర మేమున్నది యందుకూరిపురవాసా యాంజనేయప్రభో।

మ॥ తమముఁ బోవగ సూర్యవంశజు నిశాంతంబే పదా వేడి త
త్సుమనోజ్ఞాక్షరనామముఁ శ్రుతిచే నెంతో గ్రోలిశుద్ధాత్మ
జ్ఞా। నముపందఁ గ్గమకించి విశ్చలతగా వఁ జేసి రామాం
ఘ్రి దా। స్యముసే సల్పితి పందుకూరిపురవాసా యాంజ
నేయప్రభో। 71

మ॥ ఇల మా తాపిత లెప్పుడైన కుపితంబే పారగా నందియుఁ
పలుమాటల్ బలుకంగ కోపమువనే వర్తింపనగ్గాంచి, వా
కలలోఁగన్పడి, వేగ పితృలపితం కల్యాణ, మన్నట్టి పె
ద్దల వాక్యంబును దెల్పినావు బుధనేతా యాంజనేయప్రభో।

మ॥ దురపఁ జ్ఞానవిహీనమానసుడగా త్వద్వర్తనన్దెల్పు ని
ర్మలచారిత్రల, నెప్పుడు న్వినగ నుల్లంబేవ నన్భోమగా

నిలలోమజ్జడచిత్తుఁడన్ గలుగునే యింతేలనో భక్త వ
త్సల, గావందగు నందుకూరిపురవాసా యాంజనేయప్రభో॥

మ॥ నతులజ్ఞసిభవత్కథారసనిధిన్ నవ్యోద్భవ ప్రీతిచే
శ్రుతిచేపానముజేయ, జ్ఞానమమనాహృత్కంజముంతఁప వి
తతిఁతజెందెన్ గద రామతారక విశుద్ధస్వాంతుఁడౌ నిన్ను నే
సతతంబెన్నదు, నందుకూరిపురవాసా యాంజనేయప్రభో

మ॥ దయసుంతైనను లేదు భూతములపై త్వాదృక్సుదేవాళి యా
లయసమ్మార్జనమాదిపూజాక్రియల నేరన్ జేయ యుష్మత్పద
ద్వయపూజన్ జరుపంగ లేను జడుడన్ తథ్యంబుగా గావు వి
శ్చయకారుణ్యత నందుకూరిపురవాసా యాంజనేయప్రభో॥

మ॥ నను శ్రేబాయమునందు వత్సలతగానన్ జేయ, విద్యార్ణవం
బున 'వే'దింపియు ద్వాదశాబ్దమున నే ముఖ్యంబునై ధాతి నొ
ప్పు, నవోత్ఫుల్లకవిత్వదారువును నేపున్ విరార నాకందజే
య నినున్మానవకోటిమెచ్చె మునిదృశ్యా యాంజనేయప్రభో॥

మ॥ అటులేనుండ చతుర్దశాబ్దమున, నాకత్యంతపౌరాణవి
స్ఫుటధైర్యంబునొసంగి, తద్విధులనే సొంపొందగా జెప్పి, వే
సటలే కిప్పుడు నాదు దోషతతులన్ సైరించి హృద్వాసివై
పటుప్రేమన్నను గాచితో, విమలరూపా యాంజనేయప్రభో॥

మ॥ ఇల నాధిక్యపుజన్మలన్గని బుధుల్ హేలాగతిన్ త్వత్సునా
మలసద్వర్ణసమూహమున్నను వ నిర్మాలిన్యలౌనట్లుగా
గలుగన్ జేసియు, ప్రాగ్భవాచరితదుష్కర్మోద్భవాజ్ఞానక
జ్జలమున్ ద్రెంచితి నందుకూరిపురవాసా యాంజనేయప్రభో॥

మ॥ తడబాటున్నపు నీదు నామమును నిత్యంబేను దల్వంగ, నే
బడయన్ జాలను సజ్జనావళిని, నిర్భాగ్యుండ మందాత్ముడన్
కడుకష్టాబ్ధిని నీదనేరను ప్లవంగశ్రేష్ఠ నిన్నమ్మితిన్
జముడన్ గావవె యందుకూరిపురవాసా యాంజనేయప్రభో॥

మ॥ అకలంకాక్షరయుక్తమై యొసగు లోకాతీతత్వాన్నను మే
నొకమారైన దలంచ, పూర్వభవ మూహోద్భూతదుష్కర్మకం
లకమై యొక్కొను నీవికారమె జగత్సర్వంబు నో పావనీ
సకలంబీవెగ దాందుకూరిపురవాసా యాంజనేయప్రభో॥ 80

మ॥ తరుణుండన్ననుగావు, మద్హృదయమే తాల్మిన్నుంద కెల్ల
ప్పుడున్ । తరుణీనేత్రసుదృష్టివాగురములో తథ్యంబుగా
జిక్కి మోహద రసాస్వాదముఃనంద గావున నేదర్పంబు బో
గొట్టగా । స్మరణం జేతు నినందుకూరిపురవాసా యాంజ
నేయప్రభో॥ 81

మ॥ జననిన్ బాల్యత దూషణల్ సలుపవాచాటుండవై, జేయ
బోకు 'నమాతుఃపరదైవత'మ్మనియు నాకున్ జెప్పి సద్బు
ద్ధియుక్తునిగా జేసియు నీతిమార్గమును సంతోషాత్మవై
జూపితీ । వనయంబున్ నను గాచుచుండి మునిదృశ్యా
యాంజనేయప్రభో॥ 82

మ॥ ఖరసంసారజపీడలో బడగ నన్ గావించగా జెల్లునే
నరమాత్రుండవె కుత్సితాదిక్రియలన్ నవ్యంబుగా జేయ మ
ద్భరభారంబును బోవద్రోచియు నన్ పాలించు మీశా
యశస్కరమా నీకిల నందుకూరిపురవాసాయాంజనేయప్రభో॥

మ॥ సకలాత్మ్యండ వటంచు రాము కరుణాసారాతిసించచ్చరీ
రకళాశోభివటంచు వార్తులకడఁ లక్ష్యంబుగా రక్షణో
త్సుకతఁ జేయుదువంచు వేడితిని చేతోభక్తిచే భక్త పో
షక ప్రోవందగు మందుకూరిపుర వాసా యాంజనేయప్రభో॥

మ॥ నవలల్ నాటకరాజముల్ సుకవులే నవ్యంబుగా కల్పితా
భవరేణ్యంబులుగా రచించి నను త్వద్భవ్యాత్మ్యచారిత్రపే
లవమారీతి మదల్పులే వలిపిరఁ రమ్యంబుగా నుండి యీ
భువిలో తద్వరమయ్యె నెక్కునిది యే ముఖ్యంబుగా నింత యే
ల విలోలాత్మ్యడ గావు పన్నసుర కోలా యాంజనేయప్రభో॥

మ॥ తమ దుర్నీతిని బోవనాడియు భవత్పాదంబులంనుఁ స్వచి
త్తములన్నిల్పియు,యుష్మదీయ భజనన్ తథ్యంబుగా శేసి, నీ
మహముచే నుండెడివారి సద్హృదయ ధామ్ర శ్రేష్ఠమంను న్నివా
సము నీకానన మందుకూరిపుర వాసా యాంజనేయప్రభో॥

మ॥ భరమేయుం చిసుమంత నెంచకను భావస్తోమభక్తాళికు
స్తరకష్టంబుల ప్రోవద్రోచియు వెసఁ సంతోషపూరంబులో
నిరతంబెంతయొ ముంచు నిన్నుగనఁగ నీయందు గన్పట్టు నీ
శ్వర తేజోమయ మందుకూరిపుర వాసా యాంజనేయప్రభో॥ 87

మ॥ అవనిఁ మత్పితృనర్కళాయుతుని జేయఁబూని గేహాధికృ
త్యవిధానైకధురంధరత్వమున సుంతైనఁ శ్రమంజేయుటం
చు విశేషంబుగ బల్కఁకఁ వలసెనఁ సామ్మిచ్చుచుండెన్గదా
భవదీయంబగుయత్నమే యిదియు భూపా యాంజనేయప్రభో॥

మ॥ పవనాదుల్ రచియించు మౌనులకు దుష్టత్వంబునే జూపి త
న్నవయజ్ఞంబుల శోణపాతములచే నాథావిధిన్ విఘ్నసం
భవముం జేసెడి నీచదానవుల జంపన్ బుట్టినావయ్య దు
ష్టవినాశార్థుడ వందుకూరిపురవాసా యాంజనేయప్రభో॥ 89

మ॥ స్థిరమై యొప్పెడి చిత్తవృత్తిచె భవత్తేజోఘనీభూతరూ
పరజోవ్యూహాయుతాంఘ్రియుగ్మమును సేవన్జేయ భావం
బులో । నిరతంబుంచియు కౌతుకంబు నొసగన్ నిన్ దల్తు
దేవారి ఘు।స్మరప్రోవందగు నందుకూరిపురవాసా యాంజ
నేయప్రభో॥ 90

మ॥ కవియన్నన్, భువి రామనామమయమై గాథప్రకాశాత్మ
మా । భవదీయాకృతియొక్క సంజ్ఞను వెనన్ బల్మాగు
కావ్యంబులం । దు వివర్ణించుచు నెల్లకాలముల సంతో
షించునో యాతడే । కవి, పోభూతలమందు రామనిజ
భక్తా యాంజనేయప్రభో॥ 91

మ॥ అకవారాసిలోమగ్నతన్ గనియు వారత్యంతముం కింపదం
తికిలత్స్యావ్యమలై వివేకమును సుంతేనిన్ గవన్లేని వా
రికి, నన్మార్గముజూపు నేతవనఁ కోర్కిన్ దల్తు తద్భృంగగు
త్సక్యసద్గాన వె యందుకూరిపురవాసా యాంజనేయప్రభో॥

మ॥ అనయంబున్ పరమేశ్వరుండవగు నిన్నర్చించి కైవల్య
ముం । గనగానెంచి, యనేక జన్మలిటులే గావించి యం
తంబునన్ । ఘనశాంతాది గుణాఢ్యులై యడవి నిక్కన్
జేయు సంసారతృ । ష్ణనసించున్ ధర నందుకూరిపురవాసా,
యాంజనేయప్రభో॥ 73

మ॥ ననునీనామరసైకపానవశతన్ మాద్యన్మదోన్మాదు సా
మ్యునిగా జేసియు, నాకుజిహ్వాప్రు సమోన్మాదంబుగానుండి త్వ
ద్ఘనగాధాయుతమైన నీకతకముల్ తథ్యంబుగాబల్కితీ
వు, నవవ్యాకరణోపయుక్తుడవు గావోదేవ, మచ్చిత్తమం
దనయంబుల్ వసియించి బ్రోవుమునిదృశ్యాయాంజనేయప్రభో॥

మ॥ ఇకముందుమ్మువివి, విశ్వసూరిజన చిత్తైకాతి సంతోష దా
యకయుష్మచ్చరిత ప్రశస్తతమ లోకాశేషమందాత్మ హృ
ద్వికచాకారక రామలాభయుత సత్తేజో ప్రబంధంబు జే
యు,కతోరాత్మసుశక్తి నాకొసగుమయ్యా యాంజనేయప్రభో॥

మ॥ ఒకనాడుల్లమునందు కబ్బమును నేగొప్పప్పంగ జేయన్దలం
చుకనుండన్ననుగాంచి, యోరి, భువిలో సాంగోందనస్వం
బు, పూ। ర్వకవుల్ వ్రాసిరి గాన నీకు రచియించన్
గాథగాన్పింవదై। న కవిత్వాధిక ప్రేమనీకొదవెగానన్
నాదు వాక్యంబు మీ। రక, మద్వార్తల నొప్పమచ్ఛ
తకముల్ లక్ష్యంబుగాసల్పు మీ। విక, నంచున్ దయ
చేత బల్కితివి నాకేలాభయంబింక నోసకలాత్మా, గను
మందుకూరిపుర వాసా యాంజనేయప్రభో॥ 96

మ॥ ధర గుంటూరను మండలంబున నితాంతప్రౌఢభూముఖ్య
భూ। షురవిద్యానిపుణాంఘ్రిజప్రముఖమై సూర్యేందు
మార్గోపరో। ధరమూవాసుసౌధజాతయుతమై దైర్ఘ్య
ప్రతోళీప్రభా। చిరకాలస్థిరనిర్ఝరాలయమునై జెన్నొందు
నీ యందుకూరరయన్ వాసమునాకు మానికుల దృశ్యా
యాంజనేయప్రభో॥ 97

మ॥ ధరలో నేను పరాశరాన్వయుఁడ, త్వత్పాదంబుల న్భక్తి నే
మరకన్ గొల్చెడివాఁడ, మజ్జనని లక్ష్మాంబాఖ్య జెన్నారుగా
సరియౌ లౌకిక నైపుణుండు నగు శేషాచార్యవర్యుండు, నా
కరయన్ తండ్రి, భవద్దయారసమునన్ హర్షంబుచేనొప్పనన్
నరసింహాఖ్యునిగా దలంతురిల త్రాణా యాంజనేయప్రభో॥

మ॥ శతమత్తేభము లేనువెట్టితినిగా స్వల్పుండనైనన్ భవ
చ్ఛతపత్రాంఘ్రులచెంత, కావ్యగను నీశా నీని వేగాంచి త్వ
న్నతిభూతంబులదీర్ఘనంచును వచోమాత్రంబు బల్కంగ నీ
కతిలోభిత్వమదేల మానికులదృశ్యా యాంజనేయప్రభో॥

మ॥ అలయుష్మత్కృతమయ్యె నొప్పు శతకం బాచంద్రతారా
ర్కమై। యలరన్ గావుత, భూమినంచు నిరతం బాశీస్సు
లందిమ్మా నాకిల, నీకబ్బము 'వే'పఠించు విననో యేమాన
వుల్ ప్రేమ వారల శ్రీతోఁకుల జేయుచుండు బాధపాలా
యాంజనేయప్రభో॥ 100

ఆంజనేయ శతకము సంపూర్ణము.

# ఆంజనేయ దండకము.

శ్రీమచ్ఛివాకార! శ్రీభక్తమందార! యో పావనీ! నన్ను బ్రోవందగు న్నీవె, నీవేగదా మూలరూపుండవై యొప్పి, లీలావతారంబులందు న్నగన్ భూమి, రూపత్రయిన్ దాల్చి, భూతాదిసర్వప్రకారంబు సృష్టించి పోషించి నాశంబు జేయన్ సమర్థుండ వీవైతివో స్వామి! త్వద్రూపభూయిష్టమై యొప్పు సర్వంబు నీగూఢచారిత్రల న్దెల్ప వింధ్యారి, సీతా

ధవున్గూర్చి రుద్రుండవీవంచు నీయేకమూర్తిత్వముఁ జెప్పఁగా
నీవు, సీతామహాదేవి నిన్గాంచఁగా రాము నాజ్ఞఁ దగఁ శీర్ష
మందుంచి సంద్రంబు వేదాటి లంకాపురిఁ జొచ్చి, భూమీ
సుతన్గాంచియుఁ దానవశ్రేష్ఠులన్గూల్చి దైత్యేశుని జూచి
తద్గర్వము నొప్పవు వాఁశీసమూహంబులం బల్క లంక న్దగఁ
గాల్చి వే తిర్గి, సుగ్రీవ నీలాంగదా జాంబవంతాది శౌర్యోద్ధ
సైన్యంబుతో వచ్చి తద్వార్తలఁ దెల్పి శ్రీరామదుఃఖాబ్ధి
నింకించి సీతాధవున్గూడి యారక్కసుఁ జంపి వే వాని
తమ్మునిఁ దయఁ లంకకుఁ రాజుగా జేసి భూజానితో నేగి
సాకేతముఁ జొచ్చి, యాపత్తనంబందు శ్రీరామపట్టాభిషేకంబు
వే గాంచి ఓంకార టంకార ఝంకార హ్రింకార హ్రాం
ఘణణణం ఓం శ్రీం క్లీం హ్రైం హ్స్రౌం హ్రీం హ్రూ మిత్యాది
బీజాక్షరోపేతశక్తుండవై సర్వభూతాదులఁ గొట్ట యత్నించి
మద్గ్రామమహా యంచుకూరందు నివాసముఁ జేసి, పీడార్తి
భక్తాళి నెల్లం సదా బ్రోవ దైర్యాధిలబ్ధుఁడవై యుండి పారా
శరవంశసంభూత నరసింహనాముండ నౌ నన్ లేబ్రాయ
మందే భవత్పంకజాతాంఘ్రులంగొల్వ నాసక్తుగావించి నన్నంత
విద్యాప్రియుంజేసి నాచేత పాత్రంబు జేయించి నన్గాంచి
యాశీస్సుల న్నిచ్చి కాపాడు, దేవాదిదేవుండవౌ దేవ! శాఖా
మృగశ్రేష్ఠ! హే యంజనీపుత్ర! హే ధీరగంభీర! మద్ర
క్షణోద్యుక్త హనుమత్పరబ్రహ్మ! నను న్గావందగుఁ దేవ!
తుభ్యం నమోఽకేశ! తుభ్యం నమో యీశ! తుభ్యం నమో
బ్రహ్మ! హే వాయుపుత్రా! నమస్తే మద్విద్యోపదేష్టా!

నమస్తే నమస్తే నమస్తే నమః.

